# గోలకొండ పత్రిక

103567

ప్రతి బుధవారము శనివారము ప్రకటింపబడును.

REGISTERED No. N. 45 హైదరాబాదు—దక్కన్. REGISTERED No. M. 2185

సంపుటము ౨ } విభవ సంవత్సర చైత్ర శు॥ ౭ బుధవారము (౨౮ మార్చి ౧౯౨౮) { సంచిక ౯౭


## నిజాం రాష్ట్రమునకు తెనుగు దినపత్రిక

(౧)

ఈ విషయమును గూర్చి గోలకొండ పత్రికయొక్క (౯౫) సంచికలో పత్రికాధిపతులకు ఒక మాట అను శీర్షిక క్రింద వ్రాయబడిన యంశములు నిశ్చయముగా విచారింపదగియున్నవి. ఈ యంశమును గూర్చి ఇదివరకు జరిగిన కొన్ని ప్రయత్నములను తెలిసికొనుట దేశహితైషులగు వారికి అవసరమని తలచి మాకెరుకయున్న దానిని తెలుపుచున్నాము.

మన రాష్ట్రమున క్రమముగా వెలువడుచున్న వానిలో మొట్టమొదటి తెనుగు పత్రిక "నీలగిరి". ఇది వెడలి అయిదు వత్సరములుదాటి ఆరవ వత్సరము జరుగుచున్నది. మరి మూడునెలలైనచో ఆరవ సంవత్సరము పూర్తికాగలదు. ఈ పత్రిక ఆరంభమైన తరువాత దేశమున పత్రికాపాఠకుల సంఖ్య పెరిగినది. ఆంధ్రులయందు ప్రబోధమునునది ఆరంభమైనది. ఇది వెడలిన తరువాత కొంతకాలమునకు (బహుశః ఒక సంవత్సరమునకు) హైదరాబాదులో నొకరు తెనుగున "శాంతి" యను దినపత్రికను స్థాపించెదమని ప్రకటించిరి. చందాదారులుగా నుండెదమని కొందరినుండి అచ్చు దరఖాస్తు ఫారములపై సంతకములు కూడ చేయించుకొనిరి. కాని ఏ కారణము వలననో ఆ యుద్యమము ఫలించలేదు. దీనిని సంకల్పించిన మహాశయులు రెసిడెన్సి బజారులో మరియొక వ్యాపారము నారంభించి కొంత కాలము నడిపి యుండిరి. కాని పత్రిక మాట తలపెట్టియుండలేదు.

వీరి తరువాత నిట్టి సంకల్పమును చేసినవారు మా మిత్రులగు "కోహినూరు" ముద్రాలయాధిపతులు. వీరు తమ యుద్దేశమును ప్రకటించినవారు కారు. కాని వారికిట్టి సదుద్దేశముండెనని ప్రస్తుత లేఖకునకు వారి మైత్రివలన తెలిసియుండినది. కాని ప్ర[illegible]ాంగీకారము లభింపనందుననో, ఉ[illegible]యొక్క బాహుళ్యమును ఆర్థికా వస[illegible]ను, దేశములోని ఆంధ్రులందు పత్రి[illegible]నాసక్తి సన్నగిల్లి యుండుటను దలచి [illegible]మము మీరు సంకల్పసిద్ధి గాంచజా[illegible]రి.

మూడవది నీలగిరి పత్రికా విషయము. చెన్నపట్టణము నుండి వెడలుచున్న విఖ్యాతాంధ్ర దినపత్రికయందు సుమారు (౨) వత్సరముల క్రింద, "నల్లగొండ నుండి వెడలుచున్న నీలగిరి వారపత్రిక హైదరాబాదునకు తన కార్యాలయమును గూర్చి ముందు దినపత్రికగా వెడలు"నని యొక వార్త ప్రకటితమయ్యెను. అంతకు ముందే దేశమున కొంత ప్రఖ్యాతిని సంపాదించి యున్న "నీలగిరి" కిట్టి గౌరవమునకు నిశ్చయముగా తగియే యుండినది. ఈ మహోద్యమమునకు ఒక దేశాభిమానులు ద్రవ్యసహాయ వాగ్దానము నొసర్చియుండిరనియు, ఆ వాగ్దానము నెరవేర గల్గునను సదాశ దృఢముగనే యుండెననియు వినియుంటిమి. మేము వినియు రెండు వత్సరములు గావచ్చినవని మాతలంపు. కాని ఇంతవరకు అట్టి ప్రయత్నము లారంభమైనట్లు తెలియవచ్చుట లేదు. కనుక ఇదియు సంకల్పమాత్రమునందే యున్నట్టులున్నది. కాని కార్యరంగమునకు దిగలేదు.

మన రాష్ట్రమునందు తెనుగున దినపత్రికను నెలకొల్పుట ఎంతటి పవిత్రకార్యమో అంతే కష్టకార్యము. మొట్టమొదటి కష్టము ఆర్థికము. రాష్ట్రమున వెలువడిన రెండు వారపత్రికలగు "నీలగిరి" "తెనుగు పత్రిక"లు ఆర్థికములగు చిక్కులకు లోనైన సంగతి తెలిసినదే యున్నది. ఎన్నో ముందునకు వచ్చుననుకొన్న "తెనుగు పత్రిక" కొన్ని సంచికలు క్రమముగా రాకుండుటవలన ఆగిపోయినదా యను సందియము గలిగించుచున్నది. కొంత ఆశాభరితముగ సాగుచున్న పత్రిక గోలకొండ యను అర్ధవార పత్రికయే. పశుపత్రిక యొకటి శైవప్రచారిణి యనునది వరంగల్లునుండి వెడలుచున్నది. స్వక్రమముగా వెడలు విషయమునదీ పత్రిక ప్రశంసార్హము. దీని దృక్పథము విశేషముగ ధార్మికము. ముఖ్యముగా శైవమత ప్రచారము.

మన రాష్ట్రములోని ఆంధ్ర వార్తాపత్రికాసంపద పైన చూపబడియున్నది. దిన ప

త్రిక స్థాపించు విషయమున జరిగిన యత్నములును వివరింపబడినవి దిన పత్రికయొక్క అవసరము రాష్ట్రమున ఎంత యేని కలదు. నేను కాకపోయిన నొక పదాది తరువాతనైనను దిన పత్రిక వెలువడక పోయినచో మన రాష్ట్రములోని యాంధ్రులు వెనుకబడి యుందురనుట నిశ్చయము. రాష్ట్రమున ప్రజాహిత జీవనము క్రమముగా పెంపొందవలయును. రాజ్యాంగ, సాంఘిక, విద్యాది సమస్యలను గూర్చి యాలోచించు శక్తిజనులకు కలుగవలసియున్నది. పత్రికా స్వాతంత్ర్యమును క్రమముగా మన ప్రభుత్వమువారును తమ మౌనముద్రచేత అంగీకరించుచునే యున్నారు. "నిజాం విజయ" యను మహారాష్ట్ర వారపత్రికలోను, "రైయతు" అను ఉర్దూ వారపత్రికలోను ప్రకటింపబడుచున్న విమర్శనములను వ్యాసరచనా పద్ధతినిచూచు వారికి పత్రికలు ముందు ముందీ రాష్ట్రమున నభివృద్ధికి రాగలవను శుభసూచనము స్పష్టమగుచున్నది. పత్రికలకు కొంత నిరుత్సాహము ఏ శాఖవారి నుండి కలుగునను జంకుకలిగియుండెనో అట్టి శాఖల అత్యున్నతాధికారము మన ప్రభువుగారి యనుగ్రహమువలన ఆంగ్లేయోద్యోగుల చేతులలోనికి వచ్చినది. బ్రిటిషు హిందూ దేశములో వాక్స్వాతంత్ర్యమును ముద్రణా స్వాతంత్ర్యమును, మత స్వాతంత్ర్యమును నెలకొల్పి అవిచ్ఛిన్నముగ సాగనిచ్చుచున్న ఆంగ్ల జాతివారిప్పుడు పోలీసు శాఖపైన నున్నారు. కనుక మునుపటివలె జంకవలసిన పనిలేదు. ప్రభువుగారు చేసిన ఈ సంస్కారములు మనను ముందునకు గొనిపోవ గలవు. కాని దిన పత్రికను గూర్చి ఆలోచించుటకు ఉత్తమమైన సమయము ఆసన్నమైనది! లాభము పొందక పోతిమేని మనదే తప్పు".

---

ఈ తు ౯ నాడు శ్రీరామనవమి యగుటచే శలవుదినమగుటచే పత్రిక వెలువడదు (గో. సం)




## బట్లరు కమిషను

౨

II

దేశీయ సంస్థానముల సమస్య బహు క్లిష్టమైనది. వివిధ సంస్థానముల పరిస్థితులొకే తీరున లేవు. స్వయంపాలనాధికారములలోను, ఆర్థిక రాజకీయములలోను, ఈ సంస్థానములలో నొక్కొక్కటి ఒక్కొక్క మార్గమునవలంబించి, భిన్న భిన్నావస్థలలో నున్నవి. అందుచే ఈ రాష్ట్రము లన్నిటికి సమన్వయించునటుల ఏదియో ఒక పరిష్కారము సూత్రముగ జేయుటకు వీలులేదు.

బట్లరు విడిచించో, భారత దేశమున ౫౬౨ సంస్థానములు కలవు. వాని మొత్తపు వైశాల్యము ౬,౪ లక్షల చదరపు మైళ్లు. ఇది బ్రిటిషు ఇండియా వైశాల్యములో ... భాగము. సంస్థానముల మొత్తపు జనాభా ౭ కోట్లు. ఈ సంఖ్య బ్రిటిషు ఇండియా జనాభాలో మూడవ భాగము.

ఈ సంస్థానము లొకే కాలమున గాని, ఒకే విధమున గాని జనించలేదు. కొన్ని సంస్థానములు ౧౦౦ సంవత్సరముల ప్రాచీనములు కాగా యివి బహు నవీనములు. కొన్ని మొగలు సామ్రాజ్య వినాశనమున బుట్టినవి. అట్టి వానిలో నిజాం రాష్ట్రము, మేవాడు నేటికిని నిలిచి యున్నవి. కొన్ని శివాజీ స్వారాజ్యము విచ్ఛిన్నమగుటచే జనించినవి. బరోడా, ఇందూరు, గ్వాలియరు రాష్ట్రములిట్టివి. ఇదువరి దేశీయ ప్రభువులవస్థలో జరిగిన అన్యోన్య యుద్ధముల వలన ఉత్పన్నమైన నేపాళ, భూపాలములు, పశ్చిమమున సింధు అమీరులు, రాజపుత్ర వాళ గాంధ్రము, దక్షిణమున మైసూరు, తంజావూరు మున్నగునవి పొడచూపెను. అటుపైని బ్రిటిషువారు ఈ రంగమున ప్రవేశించి, సామ్రాజ్య తృష్ణ ప్రబలికొలగి దేశీయ ప్రభువులపై దాడిసలిపి, తమ విజయ యాత్రలో కొన్ని రాజ్యములను బొత్తిగ నాశనము జేసి, కొన్నిటిని విభజించి, కొన్నిటిని క్రొత్తగ స్థాపించి, సంస్థానముల చరిత్ర పూర్తిగ మార్చివేసిరి. దీని ఫలితముగ కొందరు సంస్థానాధీశులు సంధి పత్రబద్ధులగు బ్రిటిషువారి మిత్రులుగను, కొందరు పరాజిత సామంతులుగను, మరికొందరు బ్రిటిషు నియోజిత పాలకులగను, పరిణమించిరి. బ్రిటిషువారొక్కొక్క సంస్థానాధిపతితో నొక్కొక్క ప్రత్యేక సంబంధ మేర్పరచుకొనిరి. ఈ సంబంధములకు కొన్నిచోట్ల సంధి పత్రములును, కొన్ని సందర్భములలో ఒడంబడికలును, మరికొన్ని విషయములలో సనదులు, ఆచార సాంప్రదాయములును, ప్రమాణములు.

వైశాల్యము బట్టిగూడ సంస్థానము లన్యోన్య భిన్నములు. మొత్తపు ౬,౪ లక్షల చదరపు మైళ్ల వైశాల్యములో ౧౫ సంస్థానములు కలిసి ౪ ౧/౫ లక్షల చదరపు మైళ్లు అనగా ౨/౩ భాగము నాక్రమించి యున్నవి. మిగిలిన ౧/౩ భాగములో నితర సంస్థానములిమిడియున్నవి. పది సంస్థానములు కలిసి ౪ కోట్ల జనసంఖ్య కలిగియున్నవి. తక్కిన ౫౫౨ సంస్థానములలోని మొత్తపు జనాభా ౩ కోట్లు. ఇరువదివేలకు మించని ప్రజను, ౧౦ చదరపు మైళ్లకు మించని వైశాల్యమునుగల సంస్థానము లనేకములు గలవు. ఇవిగాక సంవత్సరమునకు ౮౦ రూ॥ రాబడి, ౧౯ చదరపు మైళ్ల విస్తీర్ణము, ౨౭ ప్రజలుగల బిజ్బార్ వంటి విచిత్ర సంస్థానములు కూడ కొన్ని గలవు.

వివిధ సంస్థాన ప్రభువుల స్వత్వములు కూడ అన్యోన్య విరుద్ధములు. నిజాం రాష్ట్రము, బొబ్బిలి సంస్థానములను గమనించిన యెడల తెల్లమగును. నిజాము ప్రభువులకు స్వంత సిబ్బంది, పోలీసు శాఖ, న్యాయస్థానములు, ప్రత్యేక టంకశాల, సుంకశాఖ, కలవు. కాని బొబ్బిలి మహారాజుకే యధికారములలో నేదియు లేదు. ఇటులనే కాశ్మీరు, మైసూరు, తిరువాంకూరు, మహారాజులకు, నైజాము, హోల్కారు, సింధియా, గైక్వారు ప్రభువులకు, ఒకరికి గల హక్కులు, అధికారములు ఇంకొకరికి లేవు.

సంస్థానాధీశుల హోదాలు బిరుదులు కూడ వేరువేరు. ఈ దృష్టినిబట్టి ఇంగ్లాండు ప్రభుత్వమువారు సంస్థానాధిపతుల రెండు తెగలుగ విభజించిరి. మొదటి తరగతికి జెందిన రాజులకు రాజ పోకలయందు గౌరవ సూచకముగ ౯ నుండి ౨౧ వరకు తుపాకులు ప్రేల్చెదరు. అట్టివా రిప్పుడు ౧౧౮ మంది గలరు. వీరిలో ౯౧ మందికి "హైనెస్" యను బిరుదము గలదు. తదితర సంస్థాన ప్రభువులకు బిరుదములు గాని, గౌరవములుగాని లేవు. మొదటి తరగతికి జెందిన సంస్థానములు కొన్ని జనాభాలో, వైశాల్యములో, రెండవ తరగతి వానికి దీసిపోయియున్నను, వానికిగల హోదా రెండవ తరగతి వానిలో దేనికిని లేదు,

వివిధ సంస్థానముల ప్రజల స్థితిగతుల యందును ఇట్టి వ్యత్యాసములే కానవచ్చుచున్నవి. దేశీయ రాజ్యము లన్నిటిలో వైశాల్యము, అధికారము, జనాభాయందు మేటియైన నిజాం రాజ్యమున విద్య నేర్చినవారు నూటికి మూడు మాత్రమే. కాని కొచ్చిన్ వంటి చిన్న సంస్థానములో నూటికి ౩౧ గురు, తిరువాన్కూరులో ౨౪ మంది యుండెదరు. తిరువాన్కూరులో శాసన సభ మిక్కిలి చాకచక్యముతో, మెలకువ గలిగి నడచుచున్నది. బరోడాలో ప్రజలు, కార్యభారము పూనుకొనుచున్నది. కాని మన రాజ్యమున నిర్జీవమై యున్నది. ఆర్థిక స్థితిలో మైసూరు రాజ్యమన్ని దేశీయ రాష్ట్రములను మించియున్నది. చక్కని బాటలు, వ్యవసాయమున కన్ని విధముల ప్రోత్సాహము, అమూల్యమగు పరిశ్రమలు, ప్రజల రాబడి వ్యయముల వార్షిక విచారణ సభలుగలవు. ఇట్టి శ్రద్ధ సంస్థానములలో కెల్ల నగ్రగణ్యమగు నిజాం రాష్ట్రములోకూడ లేదు.

ఒక్క విషయములో మాత్రము దేశీయ రాష్ట్రములన్నియు నొకేస్థానము స్వీకరించుచున్నవి. ఏసంస్థానమును సామ్రాట్ రాజ్యము కాదు (Sovereign Stat). సామ్రాట్ పదవికి రెండు ముఖ్య లక్షణములు గలవు. అందు మొదటి ఆంతరంగిక (Internal) విషయములలో సర్వోత్కృష్టాధిపత్యము; అనగా ప్రభుత్వము, తన యధీనమగు రాష్ట్రములోని సాంఘిక, రాజకీయ, ఆర్థిక నైతిక విషయము లన్నిటిలోను చెయి జేసికొని నియమము లేర్పరచగలదు. దాని తీర్మానమే శాసనము. దాని అధికారమునకు శాస్త్రీయముగ ఎదురులేదు. కాని యిట్టి శక్తి యే సంస్థానములకు లేదు. ఏ సంస్థానాధీశుడయినను దుష్పరిపాలన మొనర్చినచో, బ్రిటిషు ప్రభుత్వమువారు, స్వేచ్ఛా పూర్వకముగ రాజీనామా యనెడి పేరుతో, నాతని

## విద్యాశాఖ డిమాండుపై చర్చ

గౌ॥ డా॥ సుబ్బరాయను (విద్యాంగ మంత్రి) విద్యాశాఖకొరకు ౧౨,౧౪,౦ వేల నొసగవలసిన దని ప్రతిపాదించిరి

గాడిచెర్ల హరిసర్వోత్తమరావుగారు, ప్రభుత్వము వారవలంబించుచు విద్యావిధానమునుగురించి చర్చించుటకు గాను డిమాండునందు రు ౧౦౦ లు తగ్గింపవలసినదని ప్రతిపాదించుచు ప్రస్తుత విద్యావిధానమును ఖండించిరి పాఠశాలలుగల ప్రదేశములకన్న పాఠశాలలులేని ప్రదేశములే యధికముగ నున్నవి ఇంకను ౪౦ ల బాలుర విద్యాహీనులుగ నున్నారు ప్రభుత్వమువారిప్పుడు ఒక్కొక్క ఉపాధ్యాయునితో ప్రారంభించుచున్న పాఠశాలలు వట్టి నిరుపయోగములైనవని, ప్రభుత్వ విద్యాశాఖాధికారియగు గ్రీసుగారు నిరసించియున్నారు ఇట్లు వీనిపై వెచ్చించుచున్న ౫౦ లక్షలును బూడిదలో పోసిన పన్నీరువలె నిష్ఫలమగుచున్నది

ఆంధ్ర విశ్వవిద్యాలయము నెడల ప్రభుత్వము వారవలంబించిన వైఖరి గూడ గర్హ్యము విద్యాప్రచారశాఖల నేర్పరుచుటకు కొంతధన మొసగవలసినదని ఆంధ్ర విశ్వవిద్యాలయమువారు దెలిపిన కోరికను మంత్రిగారు నిరాకరించుట అసమంజసము ప్రభుత్వము వారి సహాయము నపేక్షించుటకు ఆంధ్రులకు హక్కుగలదు చెన్నపురి ప్రభుత్వాదాయమున చాల భాగము ఆంధ్రులచే చెల్లింపబడుచున్నది

హరిసర్వోత్తమరావుగారు ముగించుచు, ప్రైమరీ పాఠశాలలో పాధ్యాయులకు ఏ నెల కా నెల సరిగ జీతముల నిప్పించుట కేర్పాటు చేయవలెననిరి

### అయ్యదేవర కాళేశ్వరరావుగారు సవరణ బలపరచిరి

విద్యార్థులందు జాతీయాభిమానమును ప్రేరేపించువిషయము మొక్కటియైనను పాఠశాలలయందు గనిపించకున్నది ప్రభుత్వమువారి విద్యావిధానముయొక్క నిజ్జస్వభావమును వర్ణించుట కింతకంటె మరియొక నిదర్శనమవసరములేదు సెకండరీ పాఠశాలలో భారతదేశ చరిత్రను బోధించుటయే లేదు ఒక్క ఇంగ్లీషు తప్ప మిగిలిన అంశములన్నిటిని దేశభాషలోనె, బోధింపవలెనని ఎంతోకాలమునుండి ప్రజలు గోరుచున్నారు కాని ప్రభుత్వము వారీవిషయమును పూర్తిగ నిర్లక్ష్యమొనర్చిరి ప్రాథమిక పాఠశాలలయందుగాని సెకండరీ పాఠశాలలయందుగాని స్వతంత్రజీవనాధారములగు వృత్తివిద్యల నేర్పు విషయమై ప్రభుత్వమువా రెట్టి చర్యను దీసికొనలేదు

ఇంక యితరులు మాటలాడిరి సభవారంతట ఫలహారములకు లేచిరి

---



# భారత శాసనసభ

---

## ఆర్థిక చట్టముపై చర్చ

---

### మార్చి ౧౮ ఆర్థిక చట్టముపై చర్చజరిగెను
### రాబడిపన్ను మిష్టికుటుంబములు

సమిష్టి హిందూ కుటుంబములందు మొత్తము రాబడి రూ॥ ౫౦౦౦ లను మించినప్పుడే పన్ను విధింపవలెనని ముక్తాయిసింగుగారు ప్రతిపాదించిరి ఇప్పుడు సాలునకు కనీసము ౨౦౦౦ లు రాబడియైనచో సమిష్టి కుటుంబముల సభ్యులపై పన్ను విధింపబడుచున్నదని దెలిపిరి

సూచన ఓడిపోయెను

### పండిత మాలవ్యాగారు

ఆర్థిక చట్టమును నిరాకరింపవలెనని సూచించుచు పండిత మాలవ్యాగారు యిట్లుపన్యసించిరి యుద్ధసమయమునందు పన్నులధికమయ్యెను యుద్ధము ముగిసిన పిదప ఇన్ని సంవత్సరములైనను తగ్గలేదు ఆర్థికము నందేగాక సైన్యమునందునుగూడ దుష్పరిపాలనగలదు ఇండియాలో అంతఃకలహము లేకుండజేయుటకై ౭౫ వేలమంది బ్రిటిషు సైనికులుండ నవసరము లేదు ఇండియాలో సగటున మనిషి ఒక్కింటికి రాబడి ఆంగ్లేయుల రాబడిలో 1/20 వ వంతున్నపుడు ౫౬ కోట్లు సైనిక వ్యయముజేయుట అసందర్భము ప్రతిసంవత్సరము ఇండియాలోని బ్రిటిషు సైన్యమునందు ౫౦౦౦ మందిని తగ్గించి అవసరమైనచో భారతీయులను వారిస్థానే చేర్చవలెను వారు ౧౪ నం॥ ఉపన్యసించిరి

### శ్రీనివాసయ్యంగారు

ఇండియాలో బ్రిటిషు రాజ్యమును బలపరచుటకై సైన్యమున్నది కాని విదేశములనుండి భారతీయులను ప్రభుత్వమువారు సంరక్షింప లేకున్నారు మితవ్యయ విధానము ననుసరించి పన్నులు తగ్గింపలేదు విద్యావిధానము సహేతుకముగలేదు మద్యపానము తొలగింపలేదు, అందుచే ప్రజావిశ్వాసము గోల్పోయెను

### పండిత మోతీలాలు నెహ్రూగారు

ఈ సభవారు అనుమతిపై ఖర్చు పెట్టవలసిన అంశములు కొన్నింటిని సభవారు నిరాకరించినను ప్రభుత్వమువారు గ్రాంటులను తీసుకొనిరి ఇట్టిచర్య దౌర్జన్యమనిపించుకొనును (వినుడు, వినుడు) పూర్ణ ఆత్మగౌరవముగల వారెవ్వరు ఆర్థికచట్టమును అంగీకరింపజాలరు ఒకప్పుడు నేను బ్రిటిషు ప్రభుత్వము వారి వాగ్దానముల నమ్మియుండెడి వాడనుగాని ఇప్పుడానమ్మకము పోయెను ఇండియాకు బాధ్యతాయుత పరిపాలన నొసంగు విషయమున ప్రభుత్వము వారెన్నడును మనఃస్ఫూర్తిగ అంగీకరించలేదు సైన్యము నందు యితర ఉద్యోగములందు బ్రిటిషువారికి భారతీయులకు అర్హతనుగూర్చి పరీక్షమూలముగ పోటీ బెట్టినచో భారతీయులే గెలుపొందుదురు. (హర్షధ్వని) బ్రిటిషువారు రేపు విరమించినచో సైన్యములు మమ్ములో ... కాన రాకుండ మాయమగుదురని న్యాయమైట్టుమను ప్రతిక్రియ సేయు స్వతంత్ర భారత సౌధముయొక్క పునాదులయందు మేము పూడ్చబడి మాశ్మశానములపై స్వాతంత్ర్య సౌధము నిర్మింపబడవలెననియే మా కోర్కె

సభ నాటికి ముగిసెను

### ఆర్థిక చట్టము ఆమోదింపబడుట

మార్చి ౧౮ భారత శాసనసభ నేడు సమావేశమయినపుడు ప్రశ్నోత్తరములు జరిగినపిదప ఆర్థిక చట్టముపై చర్చ కొనసాగెను

సర్ మిష్టరు కానూనుగా రుపన్యసించుచు ప్రభుత్వమువారు యీసారి అనేకసారులు ఓడిపోవుటచే వారికి మిత్రులుగనున్న వారుగూడ ఇండియా ప్రభుత్వచట్టములో నేదోగొప్ప లోపమున్నదని అనుకొనుచున్నారు (నవ్వు) అని తెలిపిరి ప్రస్తుతము నిరాకరింపజేయు విధానమును ఖండించిరి.

### దుష్టప్రభుత్వమునకు దమ్మిడీకూడ యివ్వరాదు

జిన్నా మహమదు ఆలీ జిన్నాగారు యిట్లు గనిరి — గ్రాంటులను చట్టములను పునరుద్ధరించుట, సిటోప్రయి అధికారము యివి శాంతరూపమునున్న సైనికాధికారములు హోము డిపార్టుమెంటు ఇండియాలో ౫౧,౦౦౦ యూరోపియనుల కుద్యోగము లివ్వబడుచే కోటిమంది భారతీయులు తిండిలేక మాడుచున్నారు గత ఐదేండ్లలో పరిశ్రామికాభివృద్ధి చేయుటకు గనేలేదు నిరుద్యోగుల సంఖ్య హెచ్చుచున్నది వారందు హేస్టింగ్సు నాడెట్లున్నదో యిప్పుడట్లే యున్నది వారన్నియు బహిరంగముగ రహస్యముగ నొనరించుచుండిరి బ్లాకెటుగారు రహస్యముగ జేయుచున్నారు ఆదే వ్యత్యాసము అందుచే బ్లాకెటుగారికి పూవులగుత్తులుగా నొసంగవలసినది హేళనచేయవలెను

కీర్తిసంపద, ధనమాన సంరక్షణము, స్వేచ్ఛావర్తక వాణిజ్యములు మున్నగు విషయములు దేనియందునగూడ యీ ప్రభుత్వపుచర్య సంతృప్తికరముగ లేదు నిందార్హము కావున యీ దుష్ప్రభుత్వమునకు ఒక దమ్మిడీకూడ నివ్వరాదు

---

## "బాల్కొండ"

(స్వకీయ విలేఖరి)

### నీటి ఇబ్బంది

ఈ సంవత్సరము వర్షకాలము బొత్తిగ లేనందున నీటి ఇబ్బందికలదు, అప్పుడె కొలనులలో నీరు ఎండిపోవుచున్నది ముందింకను నీళ్లు త్రాగుటకు చాల కఠినముగ నుండునని సందిగ్ధమగుచున్నది ఎండలు తీవ్రముగ నున్నవి కాని ఉదయమున శీతల మెక్కువ యుండును,

## "చేపూరు"

పై గ్రామము ఇచటికి సుమారు మూడు మైళ్ల దూరము, శ్రీయుతులగు తోపారెడ్డి, నరసింహారెడ్డి గంగారెడ్డి, ఉపాధ్యాయులగు లక్ష్మీపతిగార్లు వారు గ్రంథాభిమానులేగాక గ్రంథాలయ ప్రచారోత్త కార్యముల పట్ల మిక్కిలి శ్రద్ధగలవారు వీరు విభవ సం॥ చైత్ర మాసారంభము నుండి భజన సంఘము స్థాపించి అందు శుక్ర, సోమవారములు భజనలు జరుప బడునని తెలుపుట కెంతయో సంతసము. కాని దీనితో సహా పత్రికా పఠన మందిరమే కాని గ్రంథాలయమే కాని స్థాపించి ఈ ప్రాంతము సోదరులకు మార్గదర్శకులగుదురని విశ్వసించుచున్నాము, తలచిన క్షణము లోకాగలదు.

## "ఆర్మూరు"

ఇది తాలూక స్థలము గ్రామము గొప్పది. శ్రీ శ్రీ వెంకట్ భూమా రెడ్డి దేశాయిగారి యాజమాన్యమున నొకప్పుడు గ్రంథాలయము స్థాపించినటుల వినికిడి కాని ప్రస్తుతము గ్రామస్థు లెవ్వరును అభిమానము కనుపర్చనందున అంతరించినటుల తెలియుచున్నది. దీనిని పునరుద్ధరించుటకు భజన సంఘాధ్యక్షులగు శ్రీనల్లూరి బుచ్చన్న గుప్త గారు శ్రద్ధ వహించిన సత్వరలో ఉన్నతి దశకు రాగలదు.

